

శ్రీ.

# భిషగ్వరాంజనము.

# అష్టస్థానపరీక్ష.



## 1. నాడీనిదానము.

మారుతపైత్యముల్ద్వితయమానిత నాడియుమీఁదిక్రేవలన। జ్జైరిచరించుమధ్యగతి జెందిననాడికఫంబునయ్యెడఁ గాఁ। మీఁరియుదాటియున్నదువపేఁదగు నాడియునబ్బిరంబునం। గోరికనీపరీక్షఁ దగుకూరిమితోడ ననెన్నదీధరా॥

### వాతనాడీనిదానము.

క॥ వాతముఁడ్డోలికగతులను। ధాతువులావుకముపలెనుదగఫణియు.
వలెన్। తేతజలూకమ్ముగ్నవలెన్। ఖ్యాతిగజరించుననియెభావజహారీ॥

### పైత్యనాడీలక్షణము.

క॥ పైత్యసముద్భవధాతువు।నిత్యముచపలంబుగాను నేర్పుగగమనం
బత్యతిహంసద్గతులను। సత్యముపికగతులననియెసర్వజ్ఞనిధీ॥

### శ్లేష్మనాడీనిదానము.

క॥ అరయఁగకఫగతిధాతువు। వరచటకద్గతులవలెనువాసిగనుండున్।
కరివరగమనముతోమరి। చరణాయుధగతియుననియెచంద్రకిరీటీ॥

### వాతపైత్యనాడీలక్షణము.

క॥ పైత్యయుతవాతధాతువు। నిత్యములావుకము గతులనివసించి.
సదా। సత్యముగనెమలినడకల। నత్యంతముధాతువుండునియెగిరీశా॥

### వాతశ్లేష్మనాడీలక్షణము.

క॥ వాతయుతకఫముధాతువు। ఖ్యాతిన్నైహంసవలెను బెరుగుచునడు

చుఁ। ఖ్యాతిగఁ కుక్కుటగతులను। ధాతువుచరియించుననియె తారేశధరా॥

## శ్లేష్మపైత్యనాడీలక్షణము.

క॥ ఆకలితోనున్న ఫణివలె। భీకరముగ నడచుబిదప। భేకముగతులన్ శ్రీకొని పైత్యశ్లేష్మం। బేకంబై నడచుననియెఱిందునిభాంగా॥

## సన్నిపాతనాడీలక్షణము.

ఉ॥ కట్టెలమోపుమధ్యమున గాసిలుచున్న హీమంబుమాటికియుఁన్। దట్టముగా జరించునతిదారుణమందముచంచలత్వమున్ । కుట్టినసూత్రస్వరూపములఘోరగతిన్ జరియించుధాతువున్। బెట్టిదసన్నిపాతగతివేమరుఁజెల్పునుమూవసోహరా॥

## 2. స్పర్శలక్షణము.

చ॥ స్పృశనయువాతరోగములస్వల్పపువేడియుపైత్యరోగికిన్। గురుతగనెప్పియున్ పిదపగాఢముగాచెలువొందియుండుటల్ । సరవిశ్లేష్మరోగికిని సారెకుశీతలమయ్యుద్వంద్వమున్। మరుచిరపెకరిభంగులనమూటిగనంగనుమంపునీశ్వరా॥

## 3 రూపలక్షణము.

ఉ॥ రూపమువాతరోగికిని రూక్షగనల్లనివర్ణమౌటయున్ । యేపుగపైత్యరోగితను వెప్పుడురక్తహరిద్రవర్ణముల్। ప్పొగతెల్లనాకఫముప్రూగ్గనివర్ణముసన్నిపాతము । ద్దీపితద్వంద్వరోగి మెయిుతేజము మిశ్రమనెన్మహేశ్వరా॥

## 4. శబ్దలక్షణము.

ఉ॥ మాటలువాతరోగికిని మానుగశాంతసమత్వభాషణల్। ధాటిగపైత్యరోగికిని దారుణశబ్దవిలంబనంబగున్ । సూటిగనామ్లరోగికిని సొంపుగస్వల్పముపీలమాటలున్। తేటగమిశ్రరోగికిని తేలికమాటలనెన్ మహేశ్వరా॥

## 5. నేత్రపరీక్ష.

సీ॥ నేత్రపరీక్షను నేర్పుగా జెప్పెద శాస్త్రసమ్మతముగ జనులకెల్ల। నయనముల్ నల్లనౌనవినీళ్లుగారుట ఖ్యాతిగా శూలయువాతగదకు। రక్తవర్ణముతో డరాణించుపచ్చనై పైత్యరోగికికండ్లుంబరగుచుండు। పాండువర్ణముగనునిండుగా నేత్రముల్ శ్లేష్మరోగికినుండు జడితముగను। పీతలోహితవర్ణముల్ చేతసన్ని। పాత నేత్రములుండునుబాగుగాను। కామిలంబుకునతిపచ్చగల్గునేత్ర। ములనను చుదెల్పె ధన్వంత్రిమూలపురుష॥

## 6. పురీషలక్షణము.

ఉ॥ మారుతరోగికిన్ మలముమానుగనల్లనయౌటయున్ సదా। భూరిహరిద్రరక్తములబొల్పుగ పైత్యరుజంబువానికిన్। మీరగపాండువర్ణములమీరికఫజ్వరమున్నవానికిన్। యారయద్వంద్వరోగులకునంచితమిశ్రముచంద్రశేఖరా॥

## 7. మూత్రలక్షణము.

ఉ॥ మూత్రపరీక్షవాతముకుముందుగ శ్యామలవర్ణమౌటయు ధాత్రినిపైత్యరోగికిని। దారుణలోహితవర్ణమేంటయున్। చిత్రముగాకఫంబునకుశ్వేతముగానగుద్వంద్వరోగికిన్। సూత్రముగానుమిశ్రమయిసూటిగనుండును రాజశేఖరా॥

### మూత్రముపరీక్షించుక్రమము.

ఉ॥ అరయరోగి మూత్రమును నంచితరాత్రి త్రియామమందునన్। గూరిచికాంస్య పాత్రనిడికోరికచే తపనాంశు మందునం। గూరిమి తోడనుంచియటకూర్మిదలిర్చముహూర్తమూత్రమున్। భూరితృణంబుచేతయిలపూరనుబిందువవేసిచూడవిస్తారముగల్గు రోగములసారముదోచునసెంగిరీశ్వరా॥

### సాధ్యమూత్రలక్షణము.

చ॥ సురుచిరభద్రపీఠముసుశోభితమద్దముశంఖముందగన్। వరకము

అష్టస్థానపరీక్ష.

లంబుశ్వ్రక మును వాసిగ చామర చంద్రవీణలున్ । భరితము గాను మూత్రయు త పాత్రను తైలము దృశ్యమైనచో౯రవుగ సాధ్యరోగమని సెమ్మిని దెల్పిరిసీల కంధరా॥

అసాధ్యమూత్రలక్షణము.

ఉ॥ సర్పమునక్రపోతుమోతును చారుబిడాలలు లాయఖడ్గముల్ । దర్పితవ్యాఘ్రిచర్మమును దారుణ[illegible]ణమనుష్యరూపులుం । దీర్ఘగరోగమూత్రమున దీప్తిసబిందువదృశ్యమైనచో । గర్భమసాధ్యమంచుమది దానిదలంతురు వైద్యులీశ్వరా॥

ఠ జిహ్వాలక్షణము.

ఉ॥ మారుతరోగిజిహ్వయును మానుగశ్యామలకాంతి శైత్యమున్, భూరిహరిద్రరక్తములు బొల్చుకఫంబున శ్వేతవర్ణముల్ । సారెకుద్వంద్వరోగమున సంకరరూపము సన్నిపాతజిహ్వ । రయుక్తకృష్ణకంటకసమంచిత రూపము పార్వతీప్రియా॥

అష్టస్థానపరిక్షసమాప్తము.

# జ్వరప్రకరణము.

## అజీర్ణలక్షణము.

ఉ॥ ధూమమునన్ స్వభావమయిదోర్బల గంధము గున్ విధూమతన్।
భీమతరామ్లగంధమున పేర్మిని వెల్వడి యందునంగముల్। వేమరుపీడ జేయ నతి
వేగమునన్రస శేషజీర్ణము। ద్దామముగాను మూర్ఛమున దారుణశూల
జనించునీశ్వరా॥

## జ్వరలక్షణము.

క॥ జ్వరములు నేడువిధంబులు। వరుసగవాతంబు పైత్యధాతిగ శ్లేష్మం।
బరయగభూతా జీర్ణము। ధరనభిఘాతాది ద్వంద్వజ్వరములునఘా॥

## వాతజ్వరలక్షణము.

ఉ॥ కన్నులుమూయుటల్ ఘనసుకాయముకంపమునుల్ శిరోవ్యథం।
బున్నతమాపవింతలతియూష్ణముశ్వాసమతిభ్రమించుటల్। వన్నెగఛర్దియు
న్మలవిబద్ధముగోళ్లశరీర నైల్యముల్। యిన్నిగుణాలు వాతజ్వరమింతయునా
ష్పన నెన్నదీధరా॥

## పైత్యజ్వరలక్షణము.

ఉ॥ తాపముగగ్లియుల్ తృషయుదారుణమూర్ఛజ్వరంబునన్సదా।
లాపమునిద్రయుల్ క్షుధయులావగునక్షికరాంఘ్రులుల్ మహా। తాపముచేత
సృక్కుసతతంబుననంబుభ్రమింగలంగుబో। నేపరుపైత్యజజ్వరమునీగతియం
చువచింతురీశ్వరా॥

## శ్లేష్మజ్వరలక్షణము.

ఉ॥ హారమునందువాంతియును నంగముగోళ్లగు తెల్లనూటయున్।
దారుణశ్వాస కాసలును తాపము కొంచెపుదాహమున్శిరో। భారము

నూష్ణవస్తువుల వాంఛయుగల్గిన దాభిలాషమున్ । భూరిగుణాలి చేతకఫమూష్ణము రాజిలువంగజాంతకా॥

### భూతజ్వరలక్షణము.

ఉ॥ ఊరకెరోదనంబుతనువూరి తకంపవ్యథా ప్రభాష్పముల్। సారెకుదంతముల్ జ్వలితసంతతమూష్ణమునిండి యుండుటల్ । భూరిప్రలాపముల్ మరియుబొల్పుగ నాటలు పాటలున్ సదా । చేరిచెలంగుభూతజ్వరచిహ్నలనెన్నహిరాద్రిభూషణా॥

### అజీర్ణజ్వరలక్షణము.

ఉ॥ అంగముతీపునన్నరుచిచిహ్నముసైసకనుండుటన్సదా। సంగున జీర్ణముండునతిలావగునూష్ణముస్వల్పకాసతో । సంగుగశోషనొందిశిరసంమునశూలజనించుఛర్దినిం । బొందగజేసి జీర్ణజ్వర భూతము రాజిలువంగ జాంతకా॥

### అభిఘాతజ్వరలక్షణము.

చ॥ జ్వరమతిసూక్ష్మమైదనరిశల్యగతంబుననుండిదేహము స్నరత ముపీడజేయునతినీరసమెప్పుడుగల్గి దాహము। స్వైరివిగకాసనారుచిరివేమరుజేయుచుగ్రూరబుద్ధిచే ధరనభిఘాతనామమున దారుణమై గనుపట్టునీశ్వరా॥

### వాతపైత్యజ్వరలక్షణము.

చ॥ వదనముతీపియుక్ మరియు వారికనాయుత వాగ్విశేషముక్। ముదముగమానసంబునతిమూర్ఛకటిస్థలిసంధులున్వ్యధల్ । వదలకకాసయుక్కఫమువాంతి జడత్వములంకురించియు । కుదురుగ వాత పైత్యజము ఘోరగతింజరియించునీశ్వరా॥

### వాతశ్లేష్మజ్వరలక్షణము.

ఉ॥ శీతముకాసఛర్దియరుచిత్వజడత్వవిదాహముక్సదా । వాతయుతాంగపీడయునవారితహిక్కలుమూర్ఛనూవెయున్। ఖ్యాతిగనిద్రలా

వునతిగాఢముగానెగనూర్పులీగతిన్ । వాతకఫజ్వరంబిటుల వర్తిలునంచువ
చించెశంకరా॥

### శ్లేష్మపైత్యజ్వరలక్షణము.

చ॥ వదనముచేదుమోహమునవారితకాసయుతుక్షుత్స్వేదమున్ । బొదలుతృషారుచిత్వములుబొందితనూజడిమంబునెప్పుడున్ । వదలకనూష్ణముండునతివాంతిప్రలాపముతోనుభాతిగా।నదియునుశ్లేష్మపైత్యజ్వరమెంతయునొప్పుచుమామనోహరా॥

### సాధ్యజ్వరలక్షణము.

సీ॥ ఇందీవరముమాడ్కి—సుందరతరముగానేత్రముల్ విలసిల్లునెనరుగాను।చంద్రసన్నిభకాంతిసాంద్రముఖంబునుసమధాతువుగనాడిసంచరించు। కోకిలపలుకుతోనేకమైస్వరముంపుతుమ్ములుత్పన్నచూనిమ్ములుగాను । అన్నవాంఛయుగల్గివన్నెగామూర్ధ్నంబుకొండగాతి యుతమగు నిండుగాను । కరరేఖనఖములు వరరక్తపూర్ణమై పాదపాణిని వెచ్చబరగుచుండు। కర్ణములకింపుభాషణల్ గలిగియుండు । గంధయుతముగ నాఘ్రాణమొందియుండు॥ యీగుణంబులుసాధ్యముల్బాగుమీరగ। ననుచుధన్వంత్రిబలెకెనుప నసిజారి॥

### అసాధ్యజ్వరలక్షణము.

సీ॥ జ్వరముతీక్ష్ణముగాను నిరతంబునిండెయు నంగంబుశీతమైసాంగముగను। ముఖకాంతియునుస్రుక్కి—నఖపాదకరములురక్తంబులేక నవ్యక్తముగను । నాభిహృత్పాదాదినాసికస్వేదముల్ స్వరముహీనంబయ్యేవిరివిగాను। పాదపీడయుగల్గిభాతిగాశ్వాసయు నేత్రాంతములురక్తనెరవుదప్పి । దృష్టియుభగ్నమైనష్టరూపముచేతనీరుగారియుకండ్లుమేరదప్పు। నాడికుటిలంబుచపలమైనడుచుచుండు। పిదపమందంబుగానుండుకదలకుండు । నీగుణంబులసాధ్యముల్ గోగుకుసు। హితవుగాచెప్పెధన్వంత్రియిందుమౌళి॥

జ్వరప్రకరణము-సమాప్తము.



# కషాయప్రకరణము.

## వాతజ్వరకషాయము.

అలగగహంసపాదిచిరుయామిదవ్రేళ్లుకొలాకుపొన్న తె। క్రొలియు నుదుంపగాష్ట్రిమునుగంధము వెల్లులిశొంఠియు క్తమై। సలలితపాచమాఘున కషాయమువాతజ్వరంబు ద్రుంచును। జ్వలమునగనంచు చెప్పెసురవైద్యుడుదక్షుసుతామనోహరా॥

## 2. పైత్యజ్వరకషాయము.

మ॥ ధనియాలున్ కసువేరుకాకు పెసరుల్ ద్రాక్షాఫలంబుల్ దగన్ ఘనపర్పాటకతిప్పతీగెయును వంగాలొప్పక్వాథంబు ద్రా। విన పైత్యజ్వరముల్ న శించుసుఖియై పెంపొందునంముక్తదయా। త్మ్యధన్వంతరి చెప్పె కుంభజునితో దాక్షాయణీవల్లభా॥

## 3. శ్లేష్మజ్వరకషాయము.

క॥ ములుగోరింటయుములువేం। పలిశొంఠియునడ్డసరము వాకుడు ముల గల్। వెలయుకషాయము శ్లేష్మ। జ్వరముల బరిమాన్పునిదె వరశైలధరా॥

## 4. అజీర్ణజ్వరకషాయము.

గీ॥ త్రికటుకలువస తెల్లుప్పి త్రిఫలచిత్ర। మూలపిప్పలికట్టెయు ముస్తోమములకషాయంబజీర్ణములన్ని బాపు। నని యెధన్వంతరి గౌరీశయుభ్రకేశ॥

## 5. భూతజ్వరకషాయనిర్ణయము.

క॥ ఉలివరియుశొంఠిపిల్లిదే। గలుముస్తలు చేతిపొట్లకటు కరోహిణి యుఃన్। బలుతిప్పతీగెక్వాథ్యం। బలరియుభూతజ్వరంబు లణచును నభవా॥

## —6. వాతపైత్యజ్వరకషాయము—

సీ॥ కరక శేకట లిపిప్పలిక త్రైతిప్పతీ| గజుచువేళ్లు ముస్తలెంతెనిహంస | పాదిక్వాథంబుచే వాతపైత్యజ్వరము | భగ్నమగుచునెఘనన్వంత్రి భావజారి॥

## —7. అభిఘాతజ్వరకషాయము.—

గీ॥ మంచిములగ పాటమారేడుపల్లేరు | కరక తాడిత్రికటుకములుచిత్ర | మూలమును కషాయమును యభిఘాతజ్వ | రంబుద్రుంచుననిరమేనంబికేశ॥

## —8. వాతశ్లేష్మజ్వరకషాయము.—

క॥ ములకద్వయంబుత్రిఫలం| బులుదగుశొంఠియును చిత్రమూలంబుసువా| విలసగుకషాయసేవను | బలువాతశ్లేష్మజ్వరము బాయును నభవా॥

## —9. శ్లేష్మపైత్యజ్వరకషాయము.—

చ॥ పొలుపుగతిప్పతీగ పెడముత్తువపుల్లముపొన్నతుంగము| స్తలుకరకాయశొంఠియును తాడిఫలంబులునేలవేములున్ | చెలువుగనీకషాయమందశ్లేష్మజపైత్యజ్వరంబులన్నియున్ | బలుమరుబాయునంచుసురవైద్యుడు దెల్పెసతీమనోహరా॥

## —10. విషమజ్వరకషాయము.—

మ॥ అరయన్ శొంఠియువేపయీనెలును చవ్యంబొప్పగాపాటనేరులుపర్పాటకచిత్ర మూలమును వెల్లుల్లిన్ దగన్ చేతిపో | ట్లుతోజేయుకషాయమున్ గొనిన వేట్కంబీదనారోగ్యమై | పాలయించున్ విషమజ్వరంబులనటంచున్ దెల్పె సుర్వీధరా॥

## —11. సర్వజ్వరకషాయము.—

క॥ ఇంచ నేల వేము చవ్యము | ముఖి మొసలి తిప్పతీగె పొలుపుగ శొం

లిన్ । గలయకషాయముగొనినను । బలుసర్వజ్వరములణచుపంచముఖేశా॥

## 12. దోషజ్వరకషాయము.

ఉ॥ పులిమీరిచిత్రమూలమును నొప్పుగమారెడు వెల్లయుప్పివా । విలయుకోలాకుపొన్నయును వేడుకశొంఠిముయాకుపొన్నలిం । పలరుకషాయమెంతయునుభక్తిని సేవయొనర్పనుగ్రమై । పలుమరుదోషజజ్వరము బాయునటంచువచించెశంకరా॥

## 13 పంచమూలకషాయము.

గీ॥ పెద్దగుమ్ముడు బిల్వపంపెనయుటెక్కలియున్నుగలి గొట్టు పంచమూలికలునీక । షాయసేవను సర్వదోషజ్వరములు । బాయుననిచెప్పెశర్వ త్రిపురమపురుష॥

## 14 అష్టాదశమూలకషాయము.

సీ॥ కలిగొట్టురేగటి ములకటెక్కలిమంచి ములకమారేడువావిలియును పెద్ద । గుమ్ముడుముయ్యాకు కోలాకుపొన్నలు ముత్తువపులగంబు ములగచక్క । చిత్రమూలంబును జిల్లేడువేళ్లను ఉలిమిరిమనుచాలయుప్పియుగము । పంపెనయునుగూడపరగ నష్టాదశమూల కషాయంబుముదముతోడ । నాకషాయంబు సేవింప నఖిలదోష । జ్వరములను సంహరించునంచాయగస్త్య । తోడధన్వంత్రి చెప్పెసంతోషముగను । అంబికానాధపరమేశ యభ్రకేశ॥

## 15 అంతర్దాహకషాయము.

గీ॥ యష్టిమధుకము చంగల్వకోష్టుశొంఠి । చవ్యసహదేవికురువేళ్లు జీలకర్ర । ధనియములక్వాధమంతర దాహమణచు । ననుచువింధ్యారితోబలెరామసనిజారి॥

## 16 జ్వరాతిసారకషాయము.

చ॥ బలువగుశొంఠియును మామిడిచెక్కయు ముస్తచవ్యమిం । ప

లరగశొంఠియున్ కొడిశపాలును దాడిమపల్లవంబులున్ । వెలసినయాకషా
యమును వేడుకపానమొనర్చినన్ముదం । బలరజ్వరాతిసారమున బాపున
నెక్ గిరిజామనోహరా॥

## 17. సర్వమేహములకుకషాయము.

క॥ ఇలవెదురాకుఫలత్రయ । ములుము స్తలుపాటవేళ్లు ముదము
నక్వాథం । బలరగమేహరుజమ్ముల । బలునరుననణగించునని యు భావజ
హరణా॥

## 18. జ్వరశూలకషాయము.

చ॥ ఘనముగతెల్లపుల్లడవి కందయుపిప్పలికట్టెపాటవేరొ । నరి
నముల్గచేకటియును నొప్పగనెండిన చిత్రమూలమున్ । దనరినయాకషా
యముముదంబునద్రావిననూష్ణశూలలక్ । దనుమనటంచగస్త్యమునితో
సురవైద్యుడు దెల్పెనీశ్వరా॥

## 19. పైత్యకఫాదికషాయము.

చ॥ ఘనముగరెల్లవేళ్లను సుగంధియుమోదుగవేళ్లుమానుబ । స్తు
నుత్రిఫలాలుపాటపసపున్ దగనిండుపుకాయవేప వేళ్లును దగజేయుక్వాథ
మునిలంగతపైత్య కఫప్రమేహముల్ । దునుమునటంచగస్త్య మునితో డన
నెంగిరిజాత్మనాయకా॥

## 20. లాజాదికషాయము.

మ॥ ధనియాల్ నేయియునిప్పతీగయును ము స్తల్ పిప్పలీయుగ్మమున్ ।
ఘనశొంఠీన్వసగాచుక్వాథముతగంగానెంతయున్ సేవచే । ననయంబొప్ప

గ్రహణిఁదాహమతిసారజీర్ణదోషజ్వరాళినిదునాశ్మదునటంచుబల్కెదయ కాళీశాయకాశంకరా॥

## 21. పాండుశోభలకుకషాయము.

గీ॥ పాతచిట్లాముగలిజేరుపరగశొంఠి। జలగు సాహత్రిణిత్రిఫలము చిత్రమూలి। మాపుపంచితమునుగాచినట్టిక్వాథ। మలరిపాండుశోభలద్రుంచునని యెభగణ॥

## 22. వింశతిమేహాలకుకషాయము.

మ॥ ధరణిఁ యేలకులున్లవంగములుముస్తల్ మంచిగంధంబునన్। గోరలుఁ మిరియమునాకుపత్రికము బాగొప్పంగ నాశొంఠియున్। యరయఁ త్రాతఫలంబులుందగుకషాయంబొప్పగాగొన్న బోసర విస్వింశతిమేహముల్చెడునన్నెన్ సర్వేశవిశ్వంభరా॥

## 23. సర్వశూలకషాయము.

గీ॥ కలబందగుజ్జుమిరియము। అలరగ క్వాథంబుచేసియతివేడుకతోఁ నిలనెవ్వరైనగొనినను। బహుశూలలబాపునని యెభావజహారి॥

కషాయప్రకరణము సమాప్తము.



# ఔషధప్రకరణము.

## 1. సర్వజ్వరకులాంతకరసము.

సీ॥ గంధకంబును తాళకమును గిలీకము వసనాభి రసములు వరుసగాను। సమభాగములు గూర్చి సర్వపాదాంశంబు త్రికటుచూర్ణము గల్పి తీరుగాను। ఆర్ద్రికరసముచే నలరంగ నొకరోజు మర్దించి మాషప్రమాణ ఘుటికలు జేసి యనుపానములతోను సేవింప సన్నిపాతములను సమయ జేసి। సప్తజ్వరంబుల తప్తంబుగావించి యాహిక జ్వరముల నణచి వేగ। విషమశీతజ్వరంబుల వికలపరచి। సర్వజ్వరముల బరిమార్చి గర్వమొసగు। జ్వరకులాంతకమను పేర జగతి బరగు। నలరునని చెప్పె హిమభూషయభ్రికేశ॥

## 2. ఆనందభైరవీరసము.

సీ॥ గంధకంబింగిలీకము నాభిపిప్పళ్లు వెలిగారమును శొంఠిమిరియములను। సరిభాగములు గూర్చి జంబీరనిమ్మపండ్ల రసమ్ముతో యామత్రయంబు నూరి। గుంజప్రమాణంబు ఘుంటికలుగా గావించి యనుపానబలముతో నలరగొనిన। కాసశ్వాసాజీర్ణ కఫవాతశూలల ద్రుంచి జ్వరాలను కొంచపరచి। సర్వమందాగ్నిదోషముల్ సరవిగాను। నణచి యారోగ్యమును దీపనాగ్ని యొసగు। నెలమి నానందభైరవి పేరులుపు మిగుల। మర్త్యమందుండునని జెప్పె మారమార॥

## 3. సన్నిపాతభైరవీరసము.

సీ॥ గంధకంబును తాళకము పారదము మణిశిల వెలిగారంబులలరసమము। వసనాభియును మూడు నతులు సన్నింటిసమ మింగిలీకమును మరగూర్చి।

నల్ జేసియుమహితకుక్కుటపుటంబొనరించిచల్లార్చిదనరఁగ దీయు। తద్రసం
బులచేతతగ రెండుదినములుమర్దనమొనరించిమానితముగ। ఘుటికలుగా
వించుకొనిపూటకడ్డిగెత్తనుపానములతోడఁ నలరఁగొనిన। పక్షవాతముపార్శ్వ
బలుకంపవాతముల్ పదమూడుసంధులబలములణచి। సూతికావాతముల్
శూలరోగంబులసొంపులణచియుచాలనింపుగాను। సర్వరోగములనుదంతిస
ముదయంబు। కొదమసింగంబురీతినిమదమణంచి।వాతరాక్షసమనుపేరవన్నె
మీర। దాల్చివిహరించుననిపల్కెదాసపోష॥

## 9. మేహాంతకరసము.

సీ॥ పరిశుద్ధతామ్రంబువరనాగవంగముల్ కాంతభస్మమునభ్రకం
బుతాళ। కముపారదమువెలిగారశిలాధాతుసమభాగములుగూర్చి సుమహి
తముగ। ఖల్వంబులోనుంచికన్నెనేఁరసాన। మర్దనల్ జేసియుమానితము
గ। దశపుటంబులు చేసిధరణప్రమాణంబుతేనెతోసేవింపతేజమొప్ప। వింశతి
మేహరుగ్వంశముల్ద్రుంచియు బహుమూత్రరోగముల్ బారదోలి। దేహ
పుష్టిచిరాయువుదీపనంబు। నతులితారోగ్యవీర్యములలరనొసగి। మించిమే
హాంతకాఖ్యతోనంచితముగ। వెలుగునని దెల్పెధన్వంత్రివేదవేద్య॥

## 10. దివ్యచింతామణి.

సీ॥ కాంతలోహమునభ్రకము హేమ భస్మంబుసింగిలీకమునాగ
వంగములును। మౌక్తికభస్మంబుమంజుప్రవాళంబుకస్తూరిరసరాట్సుగంధక
ములు। సమపాదములుగూర్చిసర్వపాదాంశంబు వత్సనాభియువేసివన్నెగా
ను। ఖల్వంబులోనుంచిగలయపెన్నేరుచే। మర్దనమొనరించిమహితముగను।
మాషమాత్రప్రమాణమాత్రలుజేసియు పూటకునొకమాత్రపుచ్చుకొనిన।
పంచపాండుప్రమేహమంచితరోగముల్ ద్రుంచివాతరుజాళినొంచివేగ।సర్వ
రోగంబులనుమేఘసముదయమును। మారుతమురీతినణచియుమానితముగ।
దివ్యచింతామణీయనంగ దేజరిల్లు। ననుచువింధ్యారితో దెల్పెనభ్రకేశ॥

## 11. సూతికాభరణము.

సీ॥ గంధకమును తాళకము పాదరసమును నాభిత్రికటులోహమభ్రకంబు। తామ్రభస్మంబు గణిశిలపాల తుద్ధనే పాళ్ళముల్ గరళి హేమమాక్షికంబు। సింగిలీకము నాగవంగసురాకార మెలిగారకరకకాయ వెండిభస్మ। మును సైంధలవణమిమ్మగజాజికాయలు సమభాగములు గూర్చి సరవినిమ్మ। పండ్లరసం బల్లకరసంబు చిత్రమూలకరసంబు ముస్తలరసము తులసి। రసముల వేర్వేర పొసగ మర్దించి యిమ్మూష ప్రమాణంబు మాత్రగానిన। సూతికావాతకఫసన్నిపాతగుల్మ। పాండుశ్లేష్మజ్వరంబుల బాపు భావ్య। సూతికాభరణరసంబన సొంపుమీర సీమ నౌషధము నుదెల్పె నెలమి నభవ॥

## 12. సూతికాభరణము.

( రెండవప్రకరణము. )

సీ॥ వసనాభిగంధకరసమింగిలీకంబు తామ్రభస్మములో హాతకరము లును। మహోషధమార్గ్మపగాహామహీ భాగపిత్తముల్ సమభాగములు గూర్చి క్రమము గాను। పంచకోలరసాన పంద్రెండుజాములు భావనల్ జేసియు భాసురముగ। అరచిన్నమౌషధంబను పానములతోడ చిన్నసుగోగాలవన్నెనణచి। సర్వసూతికవాతముల్ సంహరించి। జ్వరగణంబుల నణచియు జ్వాలతసూతి। కాభరణమనజగతి బ్రఖ్యాతినొందె। నని మునీశ్వరుతో బలెకె నాదిపురుష॥

## 13. మహాక్షయకులాంతకము.

సీ॥ వసనాభిరసమునింపెసనొక్కొకపాలు లోహాము రెండుపాళ్లైనరతామ్ర। మంతియె మూడుపాళ్ళమర గంధకమభ్రకము నాల్గుపాళ్లు శంఖంబునల్లైయలరవంగము నైదుపాళ్లుగా గూర్చియన్నియు ఖల్వంబునందు నునిచి। ఘనము గాపిప్పలిక షాయరసంబుననొకరోజుమర్దించి ప్రకటితముగ। ఘుటికలుగానించికుడుచు గానను పానములతోను సేవింపగలకితముగ। వింశతి క్షయరోగ విదళన। బొసగించి కాసరోగంబులగ్ర్వమణచి। యా బృహశ్లేష్మపై

త్యముల్ గబ్బసముగ। నణచిబలమున పుష్టియొసలరగాను। చారుతేజంబొసం గునుత్వయఖుతార।నామమునవొప్పనిబలెహ-శ్రీమహేశ॥

## 14. ర స వ ం గ ము.

చ॥ అరయగ రెండుపాళ్లు కరగరంబురసంబొకపాల్ గరంగిచె। ల్వల రగవంగకర్పూర శిలాజితుగల్పియు వల్లమాత్రముల్ । చెలువుగసేవజేసినను। శీఘ్రముగానుప్రమేహగ్రంధులన్ । బలములణంచిమేహములబాపిసుదీపనవి ఖ్యమిచ్చియున్। యిలరసవంగనామమునవెంతయు నొప్పననేన్ గిరీశ్వరా॥

## 15. పూర్ణచంద్రోదయము.

సీ। కాంచనంబొకపాలుఘనరసంబెనిమిదిపాళ్లనుపదహారుపాళ్లగంధ। కముఖల్వమునవంచికలబందరసమైర బత్తిపువ్వులనీటభాసురముగ। మర్ద నల్ జేసియొకగాజుకుప్పెలోపలనుంచికుదురుగాను। సికతయం త్రంబునసొకరోజువండిన సరుణోదయచ్ఛాయనలరియున్న। కుప్పెచల్లార్చి యొందొప్పనౌషధము నింపొందగాదీని యానందముగను। కస్తూరిజాపత్రిక ర్పూరమునునుంచిపిప్పలావాలతోనొప్పగాను। గుంజప్రమాణంబుగొరుతు గాసేవింపపాండుక్షయంబులబారద్రోలి। వింశతిమేహరుగ్వంశముల్ బాపి యుకాసపంచకములగర్వమణచి। బలువిషసంయుక్తఖలు సర్పముల నెల్లబరి మార్చుగడుసుగదిజగతి। సర్వరోగంబులనదృంచిగర్వమెసగ। వీర్యబల మున్నతత్వంబుపెనవొసంగి।పూర్ణచంద్రోదయాఖ్యతోపొలువుమీర। మర్త్యు లనుప్రోచునని చెప్పెనూరదూర॥

## వసంతకుసుమాకరము.

సీ॥ గాంగేయురౌప్యముల్ ఘనముగా వేర్వేర రెండేసి భాగముల్ మం డీసముగ। వంగనాగంబులువరకాంతభస్మంబుమూడేసిభాగముల్ ముదము గాను। సార దాభ్రకముగడముల్ ముత్యాలు పాళ్లు నాల్గేసి గాభాసుర ముగ। ఖల్వంబునందుంచి గనిదుగ్ధములచేత నాశనేక్షురసాసవస్నెసీర।పి

ల్లితేగలనరటిపక్లిరు మాలతీశ్రీచందనంబుల చెరుకునీట । చెన్నుగాచామం
తిపన్నీరముల భావనములుజేసి కస్తురినెలమిగలపి । వల్లప్రమాణంబువరుస
గాస్సేవింపపైత్యమేహగణాలబారదోలి । వింశతిక్షయరోగవంశముల్ఛేదిం
చి। పాండుగుల్మంబులపరిహరించి। రాక్షసులద్రుంచువిష్ణుచక్రంబుపగిది। సర్వ
రోగంబులనణంచుసరసముగవ। సంతకుసుమాఖ్యతోడనుజగతియందు। రా
జిలుచునుండుననబలోకైరాజమకుట॥

భిషగ్వరాంజనము సమాప్తము.

మఱియొకవైద్యగ్రంథమునందలి ఔషధయోగములు.

## 17. రాజమృగాంకము.

సీ॥ రాజమృగాంకంబు రమణతో వినుపింతు తారకాంచనలోహ తా
మ్రములును వైక్రాంతకాంతలంబు వంగాభ్రకంబులు నాగర మౌక్తికనాభిస
మము భాగముల్ గావించి పారదభస్మంబు నిన్నిటి యెత్తునను లవడించి క్షార
రనిగుండి కాచికల్హర వేపరసముల నొకనాడు పోసగనూరి । వజ్రమూసను
జేర్చియు నలుగాను । ఆోననుంచియు నొకరోజులోనపుటము । వేయునొప్పా
రుధరలోనవీరవర్య । రాజరాజమృగాంకంబు రమణమీర॥

గీ॥ క్షయయును మాంద్యజ్వరంబును శ్వాసకాస । పాండుకామలపీనస
ప్రదరప్లీహ । గ్రహణివిణ్మూత్రకృచ్ఛ్రాదికములనెల్ల । మానుదీనిని సేవించ
మానవేంద్ర॥

## 18. వాతరాక్షసము.

సీ॥ పారదభస్మంబు బలి నాభిమణిశిల కాంతంబు నాగంబు కఫరిలోహ।
తారవంగంబులు తామ్రసౌవర్ణ బుదరద హేమమాక్షిక మరదళంబు । మైలతు
దముశంఖవెలిగారము వరాట భస్మాభ్రకములు నేపాళములును । సమభాగ
ములునన్ని క్రమముగా గూర్చియు నార్ద్రకరసమునను దియు రెండు । దినము
లునునూరి కాచను బిట్టు పరచి । వాలుకంబున రెండుయామములు వండి । సాంగశీ
తలమైనను చకరాదించ। వాతరాక్షసమని ప్రఖ్యాతిగాను॥ ఉ॥ వాతము పక్షు
వాత ముఖవాత ధనుంజయవాత శుష్కకల్ । ద్వాతములాదిగా గలుగు వాత
ములంబరి మార్చి ధాత్రిని । ఖ్యాతిగ వాతరాక్షసము భావనజేయగ నొప్పు నం
చుమున్ । ప్రీతితొ నెన్ని రిట్టు వర భేషజులందరు రాఘవేశ్వరా॥

## 19. ప్రళయాగ్నిరుద్రరసము.

సీ॥ అభ్రకమణిశిల హరితాళకంబులు నయిదేసి భాగాలు నమరచరి
యు । బలినాల్గుపాళ్లును పాలశుద్ధము నాముదర దటంకణ విషద్వంద్వమరయ ।
నింగిలీకసంబును పొందనేపాళ తామ్రలోహములును తగనొకటి । జన్లైదు

బాలనుచాలుపొందమర్దించి పంచకోలములను పరగనూరి । యార్ద్రికరసమునుఅట్లనెచిత్రకషాయమునొకరోజుపాయనూరి। రాగిపాత్రలోనిడిరవ్వవాలుకమున రెండుజాములునిండవండితీయ। పేరుబెట్టిరిట్లుప్రీతినిప్రళయాగ్ని। రుద్రరసమటంచురూఢిగాను। సకలరోగహారముసరవిగనీయంగ।సనుచునుడివిరిట్టులార్యవరులు॥

## 20. జ్వరములకునాభిమాత్రలు.

ఉ॥ నాభియునొక్కయంశమును నందులయర్ధముసల్లమందునున్ శోభితసిందురంబటుల శొంఠివరీచియుకట్పలతోడనా। ప్రాభవమైనయుష్టికయుపన్నుగసిందురభాగమున్నిటన్। వైభవమొప్పమర్దనమువాకుడుజంబిరఆర్ద్రికంబులన్॥

## 21. ప్రాణేశ్వరరసము.

సీ॥ హరితాళపారదమభ్రికగంధముల్ సమసమంబుగనన్ని వేసివటియు। నేలతాడిరసాననేర్పుగాద్వినంబు మర్దించి కాచలోమట్టియునించి। వాలుకాయంత్రానవొకనాడుమందాగ్నిపాకంబుగావించిపరగదీసి। కాంచనబీజాలగలతైలమటువేసిత్రికటుకతైలానసమనూరి । కరకతాడిధాత్రికాసరసల్లేరుతెక్కలిగలిజేరుతప్పతీగ। గుంటకల్గరాకుగొడ్డుకాకరదుంపచేదిపొట్లదళముచిన్నములక। పసరులనొకజాముపరగగనూరియుమత్స్యకేశిభాగమహిషకిటుల। చేదికట్లువేసిచేయంగప్రాణనా। థరసమంచుననిధారుణీంద్ర॥ గీ॥ గురిజగింజెత్తునివ్వంగకొదువలేక।సకలసన్నులుజెడుననినిస్సంశయంబుటంచుబలికిరివైద్యులీయవనిలోన। దీనిమహిమంబదెంతనితెలుపరతు॥

## 22. పాశుపదాస్త్రము.

సీ॥ పాలతుద్ధమునుశ్లీపాషాణమునుగౌరి పాషాణములును నేపాళములును! వసనాభిహరితాళ వెసమైలతుద్ధముగొడ్డి ప్రస్తరమునుతుల్యముగను।యున్నిటికినిసమమేపారరసమునుఖల్వంబులోనిడిగట్టిగాను । జిల్లేడుబాల

నుజేర్చుచుమర్దించిహోలికాయంత్రానవ్రేలగట్టి । జాముతడవువండిచక్కఁగ
దీసియుబాగుచేయనువేసిపరగనూరి । బ్రహ్మరంధ్రింబుగోరిగించిబాగుమీర
కత్తివాట్లనువేయించిగ్రక్కునంత । గురుజగింజెత్తుతలనంట గొదుపమాన్ని
సన్నిపాతంబుబోవుదీననిస్సంశయంబు । గానదీనినిపండితఘనులుభువిని । పాశు
పదమనుపేరిడిపల్కరంత॥

## 23. లోహరసాయనము.

సీ॥ ఉక్కుఁరాపొడిపాలునోర్చు గారసమంత గంధకమాకెంటకలియ
బోసి । కలుబంధరసము నగట్టిగమర్దించి త్రాక్ష్యఘూర ముంబులోతగనమర్చి ।
మూతమూసియు దాని మూసరగఁగప్పియు గజపుట మొక్కటికమనమిడి ।
సాంగశీతలమునజక్కఁగాదీసియు త్రికటుకపాయసవిధమునూరి । తెల్లగలిజే
రుసాగయుతిప్పతీగ । అడ్డసరమునుగొబ్బియునర్కఁమూలా, మాందణ్శాల్మలి
వల్లేదువార్ధ్రివముల । గుంటకల్గరరసమును గూర్చిపదియు వీటిరసములు వేర్వే
రనిడియువేగ । నూరియొక్కొక్కపుటమునుసొనరవేసి । సాంగశీతలమైననుస
రవిదీయ । లోహరసమనియెన్నిరియూఢిగాను॥

గీ॥ శ్వాసకాసపాండుక్షయాలమరిశ్లేష్మ । పిత్తచిహ్వాజాత్రష్ట్నహ
వ్యాధి । శతములణచునిదియెసాధనంబునుచును । చేతుకిట్లుధరను సిద్ధమతులు॥

## 24. పూర్ణచంద్రోదయము.

సీ॥ గాంగేయమొకపాలు ఘనరసంబెనిమిది పదునారుపాళ్ళనుబలి
యుగూర్చి । పైదిప్రత్తిపువ్వుపసరునమర్దించి కలబంధరసమునకలియనూరి ।
మూడుదినములునైన వేడుకనటుదీసి కాచకుప్పినుంచిఘటములోన । వాలుక
యంత్రాననొనరగనదిజేర్చుమూడుపహర్ముల చేత మెనరపండి । కడగుననుపుడు
బాడువంగట్టియైన । శీతలంబునదించియు జేష్టమెత్తు । జాజికాయయుమిరి
యాలు జాజిపత్రిపచ్చకర్పూరకస్తురిల్ బాగుమీర॥ జ్యేష్టమెత్తులపంగాలు
జేర్చిమటిచియు । మాదిఫలసారమున దానినుమతనూరి । పూర్ణచంద్రోదయం
బనిపొగడిరిట్టిమందు మెత్తును సేవింపమానుదుజలు॥

్వరసము.

రపిప్పలి యభ్రకగంధక మరిచములను।
వలవణంబుదరదంబుర సముసమము । హం
చిపోందు గాకుక్కుటపుటము వేసి। సాంగశీతల
ంబు జేసియు సొంపుమీర। మాష మాత్రంబునను
జ్వరములు వేకులు వేగవదలు। పథ్యమిచ్ఛాప్రకారంబు
నచు జెప్పిరిదీనినోయబ్జనాభ॥

మైాడీలవం
సపాదిర
సైనసన్న
పానమను
పరగజే

క॥ ఒడ్ఛ్వజరస సేవను। పరువులు బెట్టించు నెట్టి పాయానిజ్వరమున్।
నరులను వేధించిక యది । యరుపడి చెడిపోవును ము్మనుర్వీనాథా॥

## 26. శాంభవీరసము.

సీ॥ కరకకాయయుశొంఠీ గౌరీశిలంబునుగంధకంబును వెలిగారరస
[illegible]త్రమిద నేపాళ మమర గనదిగూర్చి జంబీరరసమునజకర్గాను । మూడు
దినములునూరిముద్దయూకుటనిడిమూత మూసియు చేలమ్ము ద్రిక్కిచ్చి । కుక్కుట
పుటమునకొమరొప్పగావండిసాంగశీతలమునజక్కదీసి। మొత్తగానూరియౌ
షధమొత్తుకును। దశమభాగంబుమిరియాలుతగను నైను । భాగములు నాభిక
ప్పనపరగగూర్చి। గురిజమాత్రంబునిచ్చినగుదురురుజులు॥

గీ॥ ఆవు పెరుగును నన్నంబునను దినంబు। పథ్యమిాంరీతియనియును పలి
కిరంత। భేషజములు జేసురంతయు బెంపుతోడ। రమణనొప్పారు శాంభవీరసము
వినుము॥

## 27. నారసింహరసము.

క॥ రసబలిశిల నేపాళము । వసనాభియు గౌరిశిలయునాయభ్రిక
మున్। వెనసమము వేసికాకర । పసరునదినములను రెంటబాగుగనూరన్॥

క॥మూకుటనుంచియుమూతిడి। ప్రాకటముగకుక్కుటాగ్ని పాకము
జేయున్। కీకుగదించియుమగుసను । సాకొనిమరిందించి రెండుకుంజములమతి
యున్॥

## 33. సూ॥

సీ॥ గాంగేయమభ్రకగంధక ౦బునాగ
భస్మ । వంగంబు వెండియు వైక్రాంతరసం సుసమముగా
గూర్చి। నిగుడాండకాకరనిమ్మరసంబులుగలి కు । చిత్ర
మూలముతులసిజిల్లేడుకల బంధబోడతరసిరిబొ గరసముల
యదియునుదీసిమరియు। మర్దనము జేసియంతటమం... ప్పెలోసిడి
వాలుకనొప్పవండి । సాంగశీతలమైనసుజక్కదీసి । చూర్ణ చియంత
యుచ్చోద్యముగను॥

క॥ సూకరమయూరకుక్కుట । కాకోదరమహిషతురగ కప్పలచే
దున్ । శీఘ్రగవేసీటుసూరగ । ప్రాకటముగనదియసూతికాభరణముగుఙ్॥

క॥ సూతికకానగవచ్చిన। మోదముతోనిమ్వసన్నముసుముట్టె [illegible]।
భోజనమదియు క్తము గా। మేదనిపథ్యంబుజేయ మేలగునధిపా॥

## 34. మృత్యుంజయ రసము.

సీ॥ తామ్రంబురసమును తాళకబలితామ్ర సాగరఫేనముల్ సమము
గూర్చి। బొత్తిమంపరసానబొందుగమర్దించి వజ్రమూసను బెట్టివలను ।
గజపుటముకరాటిగావించివండియు సాంగశీతలమైనచక్కదీసి। అ త్స్య
కుకురమయూరాహిచేదులు నాలుగుజాములునమరనూరి। తత రిగియం
తతదనపానమమర। రెండుగురిజలెత్తురీతినివ్వ । సన్నిపాతరుజలుసంశయుం
పకబోవు। మృత్యువిజయమునిరసత్యమరయ॥

## 35. లోకనాథరసము.

చ॥ రసవిషగంధతామ్రములు రంజిలలోహవరాటభస్మముల్।హెస
గంటుత్రయంబు సమముప్పగనన్నియు తెల్లగజ్జెరుఙ్ । వరుసనవజ్రవల్లరస
వాళములకదగనూరికుకుటా। గ్నిసరిపడంగనిట్లునుడికించినసొప్పునలోక
నాథమె॥

## 36. వాతాంతకరసము.

సీ॥ గాంగేయతామ్రముల్ కాంతభస్మములోహ తారంబు వైక్రాంత తాళకములు। బలిరసభస్మముల్ పగడచూర్ణంబును నేకాంశలన్నియు నెలమిగూర్చి। వావిలిజిల్లేడు వరహంసపాదియు నడ్డసరము కల్గార కురసము। వేపచక్కెరసంబు వెసనిమ్మపులుసును గలిజేరుసారంబు కలియనూరి। వజ్రమూసనిడు చువరుసగా నాయేడు పుటములేసి తియ్యపూర్ణముగను। రోగశతముల ణచురూఢిగ వాతాంత। కరసమనుచు వైద్యఘనులనసిరి॥

## (*) 37. క్షయకుఠారము. (*)

సీ॥ రసవిషగంధకరజితాభ్రకంబులు మౌక్తిక సౌవర్చ్చమాగధులను। నాగవంగంబులు నాగరు రీచముల్ పిద్రుపమాదూరవెలయతామ్ర। షకలకద్రయు కోష్ఠునలసుంపరాష్ట్రింబు కాంతలోహము వెలిగారములును। సమముగా నన్నిటి క్రమముగా గూర్చియు కల్వాన వేసియు ఘనతగాను। వాకుడు గలిజేరు వావిలి నల్లేరు అగ్నిభృంగి ఓమము చపాది। అర్ద్రకరసమున నమరయామము నూర జెల్లు క్షయకుఠారి మెల్లజగతి। నూసియావడి నగు బూనక పద్యము। జేయవలయు దీని సేవ వళి॥

## (*) 38. నీలకంఠరసాయనము. (*)

సీ॥ రసబలిలోహముల్ పసనాభి నేపాళ చిత్రక తాళీశపత్రకములు। యేలకుల్ మోడి యుసిల విళంగంబులు ముస్తలు రేణుక మోడసమరు। త్రిఫల కేసరములు త్రికటుక తామ్రంబు త్రసమంతో నన్నియు సమముగాను। కల్వంబులోనుంచి కలిజేరు పసరున భృంగార్ద్రకేషు ఎలను పిడిసిమాదు। దినములెల్ల నుమర్దించి దిరముగాను చణకమాత్రలు ఘమాత్రలు జక్కజేసి। యివ్వ పాంషుజ్వరంబుల వెళ్ళ్వైన। పాయునీ నీలకంఠరసాయనమున॥

## (*) 39. సిందూరభూషణము. (*)

చ॥ రసబలి యభ్రకంబులను రంజిలు టంకణమొక్క రీతిగా। వెసనిడి కృష్ణకాంచనపు వేరుగ సంబున జామ నూరియుక్। మసలక హంసపాదిరసము

ర్ధనర్ఘూముసుయార్ద్రకంబునకౌ| విసువకనట్లుచేయనగు విశ్వతసిందురభూషణంబనకౌ||

## —40. వాతవిధ్వంసము.—

ఉ|| పారదవంగతామ్రములు భాగసమంబులునాగలోహముల్ |ఆరయనట్లగంధకమునభ్రకటంకకటుత్రయంబులా| మేరయునాక్షియుగ్మమును మేదినిధాత్రియుకల్లరాగ్నికా | సారకటుత్రయాత్రి ఫలపారములందగనూరగాదగున్||

గీ|| ఇట్లుచెప్పినవస్తువృలెలమినాల్గు | యామములమర్ధనము సేయజగతినివియు| వాతవిధ్వంసమనుచును వైద్యులనిరి | యిదియు సేవించరుజలెల్లయాగునండ్రు||

## —41. భద్రకాళీరసము.—

సీ|| విషము నుగంధక వెలిగార నభ్రక మాగధనాగర మరిచములును| రసమును సైంధవలవణంబు ధుత్తూర బీజముల్ సమముగా బెట్టినరియు | చూర్ణంబు గావించినొంపొందమూసను రెండుజాములు దాకవండితీసి| సాంగశీతలమైన సరవిగాదీసియు మిానుచేమనువేసిపూరినూరి | మగుడమర్దంజేసియమాషమాత్ర| మిదిత్రికటుకషాయాననివ్వదోష | జ్వరములునుసన్నిలును వేగబోలగుభద్ర| కాళిరససేవనను చును ఘనులనిరి||

## —42. ఉమామహేశ్వరరసము.—

సీ|| రసమభ్రకంబులు వెససమంబులు బెట్టి చీకువెల్లురసానటీకుగాను| మర్దించికోలసుమరియుం చిత్రవాగ్ని రెండుజాములువండి మెలమదీసి| కోతిపిత్తంబునుగూర్చుకుయామంబు మర్దించియదియును మాషమాత్ర |మివ్వంగజ్వరములుసంగముగనిపారు లేతిగములకరణిలేచిపోవు| నిట్టియౌషధముపథ్యమింపుగాను| తీయనగుకూరచల్లయుబోయువలయు | ననుచు జెప్పిరివైద్యులీయనకిలోన|మాగనహో ప్వారునిదియును ఘూంచిమహిమ||

## 43. నారాయణరసము.

క॥ వెలిగారమరిదళంబును। బలియును మైల్తుత్థ మొకటిపాలుగ మరి యెం। గలిజేరు వేళ్లరసమున। నలరగ మూనాళ్లు నూరనది మరియంతన్॥

గీ॥ డోలయంత్రానవది రెండు జాములమర। యీసరవె యుంచియా వరమిట్లు వండి। యడ్డిగెత్తును సేవించనద్భుతంపు। జ్వరములణగును దీననుజ గతియందు॥

## 44. భార్గవీరసము.

గీ॥ బలియురసమును నేపాళభాగమమర। రావిచకలాకషాయాన నలరనూరి। యీతసంబున డోలనుయలమిజాము। వండిపదిలంబుగా దీసివరుస నదియు॥

గీ॥ మాగధంబును చక్కెరమరియుగూర్చి। విషమజ్వరములకివ్వంగ వేగబోవు। మారుతాపహతిబోవు మేఘములకరణి పరగ। నొప్పు రుధరణిలో భాగవంబు॥

## 45. ఉత్తమాగ్నికుమారము.

సీ॥ రసమును నాభియు వెసనమంబులుగూర్చి యగ్నిమూలరసాన నవియుదినము। మర్దించియంతయు వంటిమూసనుసడి వాలుకాయంత్రాన నొకటదినము। వండియునదిదీసి కైళంజెయదియంత ఘూష్టటమొక్కటిపాండుగాను। త్రికటుకషాయంబుదీసియుమర్దించి నాల్గవపాలు నునాభిగూర్చి త్రివియాంకురసంబున నెలమినూరి। గురిజగింజప్రమాణానగుళికజేసి। తన్ను మిరిగివ్వరుజలునుదవ్వరుగు। ఉత్తమాగ్నికుమారంబునొసగవినుము॥

## 46 సిద్ధాగ్నికుమారము.

సీ॥ బలియునురసము వెలిగారనాభులు నాలుగునొక్కరీతిసమర గూర్చి। అర్కపత్రరసానన యట్లు మర్దించి వజ్రమూసను బెట్టి వరుస నిడు। చీలమృత్తికలిప్పి చెలువొప్ప కుప్పెలో సిసుకబోసియుమూసనొనరనుంచి। నేలనుసట్టుద్రవ్వి సెర్పునగజపుట మేసియు నదియంతదీసి మరియు। గురిజగింజలంత గుళికలుగావించి తత్సరీతిదెలసితగనిడంగ। రాజుబిమాననను చుమూర్ఛగ బలిహరి। వైద్యజనములెల్లచోద్యముగను॥

## —47. మహాదగ్నికుమారము.—

సీ॥ తాళమభ్రకతామ్రముల్ నాభియు నింగిలీకపురసమిట్లుమంచి। యుల్లిపాషాణంబునొనరంగనొకయెత్తు నన్నియుగూర్చియునలవడంగ। కల్లరాకురసానకల్వంబులోనూరి కాచకుప్పెనునుంచిగట్టిగాను। చీలమృత్తికలిచ్చి చెలువారమందాగ్ని వాలుకాయంత్రానవండినను। దీసియదియునుశనగలంతేసిజేసి। మెట్టిజ్వరములకిచ్చినమట్టుపడును। ననుచువైద్యులుబలికిరియవనిరాధ। మహినిదనరుమహాదగ్నికుమారకంబు॥

## ==48. రాజాగ్నికుమారము.==

సీ॥ నవరత్నలోహములష్టపంచలవణాలు రసస్వమంబుగనన్నిరహినిగూర్చి। ఉమ్మెత్తరసమునవొకనాడుమర్దించి చిత్రమూలరసానచెలగినూరి। గాజుకుప్పెనుంచికడునారుజాములు వాలుకాయంత్రానవండిదిగిచి। సనుపానవశమునజనులకునివ్వంగ తీరునెట్టువంటిరోగములైన। పథ్యమిచ్ఛాప్రకారంబుపరగనీనుము। నొనరరాజాగ్నియనుచునుడివిరిట్లు। గురిజమాత్రంబుసేవింపకుదురునున్న। అశ్వినీదేవతులుబల్కిరనఘచరిత॥

## —49. అన్యథాగ్నికుమారము.—

క॥ నవలోహంబులురసము। యివిసమ్మియుసమమునునిచి యుర్కరసానన్। యవిరళముగైదుదినములు। సవరగమర్దించికుప్పెసరిపడనునుచున్॥

గీ॥ చీలమృత్తికలేడునుజేసియిడియు। వాలుకాయంత్రమునవండిపడమెరయ। పదియురెండునుజాములుపరగనీనుము। గురిజమాత్రంబుసేవింపకుదురురుజులు॥

## —50. ప్రాణాగ్నికుమారము.—

చ॥ రసమునునాభిగంధకము రస్యతంబుగగంధకంబునం। పొసగగనాల్గుభాగములు పొందుగమర్చియుపర్వటాద్రిసం। పెసడినూరిమూతనిడివేగమెఘాపుటమేసితీసియున్। మసలకమేకచేదుమరిమత్స్యముచేదునువేసినూరగన్॥

గీ॥ మహినరుప్రాణాగ్నికుమారకంబు। గురిజగింజంతయిచ్చినకుదురురుజులు। సంశయములేదుయనుచునుసరవిమున్ను। అశ్వినీదేవతులుబల్కిరబ్జనాభ॥

ఔషధయోగప్రకరణముసమాప్తము.

# వస్తుగుణప్రకరణము.

## పాదరసగుణము.

ఉ॥ సూతము సేవ జేసినను సూటిగ వాతకఫక్షయంబులున్। భూత భయవ్రణంబులును భూరిసవాయిశిరంగులున్ మహా। వాతగుణాదిశూలలను వారణ జేసియు మోఘవీర్యమున్। ఖ్యాతిగ దృష్టిపుష్టి ఘనకాంతి నొసంగును హీంద్ర భూషణా॥

## గంధకగుణము.

ఉ॥ మారిచచూర్ణయుక్తముగ మంచిసుగంధము సేవ జేసినన్। భూరి ప్రమేహ పైత్యరుజపూరితకుష్ఠగదాంకురంబులన్। బారగ దోలి వాతముల పైకుబికించి జ్వరాళి నొంచియున్। ధారుణిలోన గంధకము దారతనొప్పును నీశ కృపానిధీ॥

## నాభిగుణము.

చ॥ చిరతర వత్సనాభిని సతి సేవ యొనర్పగ శ్వాసకాసలన్। గురుతర రాజయక్ష్మలను గుల్మజలోదర పాండుశూలలన్। కరిమను ద్రుంచి పుష్టి ఘనకాయ దృఢాంగ చిరాయువిచ్చెడున్। నరులను బ్రోచుచుం జగతి నాభిసుధారసమంచరీశ్వరా॥

## ఇంగిలీకగుణము.

క॥ అనుపానగరిమతోడుత। ననయము దరదంబుగాని వనఘపుంజములన్। ఘనసన్నిపాతజ్వరముల। నణచియు దీర్ఘాయువొసగు నంబికనాథా॥

## తాళకగుణము.

క॥ వర తాళకభస్మంబును। గరిమతో సేవింప సర్వకాసములుం। పరిణామశూలజ్వరములు। బరిమార్చియు పుష్టినొసగు భావజహారీ॥



## కర్పూరశిలాజితుగుణము.

గీ॥ వింశతియగు మేహపైత్యముల్ వంశములను। ధ్వంసితను కాంతిదీపనం బంచితముగ। నిచ్చు కర్పూరశిల దానినెన్న దరమె। యనుచు దెలిపెను సురవైద్యుడీశవరద॥

## మణిశిలగుణము.

గీ॥ మణిశిలను సేవ జేసిన మానవులకు। నస్థిగత మేహజ్వరములనణచి గుల్మ। పాండురోగాదిశూలల బరదోలి। దీపనము సంగునని చెల్పె దేవదేవ॥

## హేమమాక్షికగుణము.

గీ॥ మాక్షికము సేవ జేసిన మానవులకు। శ్లేష్మపైత్యజ్వర జీర్ణాంచి హ్మములను। బాపి దీపనమారోగ్యబలము నొసగ। తేజమును నుండు నని చెప్పె దివ్యపురుష॥

## నేపాళగుణము.

క॥ నేపాళంబులదినినను। తాపశ్లేష్మాదిపైత్యదారుణబుజలన్। బాపి సుదీపనపుష్టియు। నేపుగ సమకూర్చునని యిభచర్మధరా॥

## రససిందూరగుణము.

మ॥ రససిందూరము సేవ జేసిన మహారాజక్షయల్ కాసలున్। వసుసాజ్ఞ జ్వరజాలమున్నుదర పాండ్వాది। ప్రమేహంబులున్। వెసనంహారమొనర్చి మర్త్యులకు నుర్విన్ తేజదీర్ఘాయువు। న్నసమానదృఢపుష్టిదృష్టి యొసగున్। ఆర్యామనోనాయకా॥

## రసకర్పూరగుణము.

క॥ రసకర్పూరము గొనినన్। వెసవాతక్షయలబట్టి వేమకతోడన్। భసితంబు జేసి మనుజుల కసమానద్యుతినొసంగు నంబికనాథా॥

పాలతుద్ధగుణము.

గీ॥ పాలతుద్ధమునను పానబలముతోను । భక్షణముజేయబుజలను బారదోలి। శూలలనుద్రుంచిపైత్యముసొంపణంచు । ననియుజెప్పెనుకుంభజుడభ్రకేశ॥

మైలతుద్ధగుణము.

గీ॥ మైలతుద్ధముసేవింపమనుజులకును । కుష్ఠరోగాదిదురదలుదుష్ట ఉదర।శూలలనుబాపిదీపనశోభనొసగునను చు ధన్వంత్రిదెలిపెనునంబికేశ॥

వెలిగారగుణము.

క॥ వెలిగారముపొంగించియు। బలుజాజీఫలముతోను భక్షణజేయన్। ఖలుగ్రహణజాలమణచియు । సలలితముగకాంతినొసగుసర్వజ్ఞధీ॥

చాతుజాతకములగుణము.

క॥సమముగచాతుజాతక ।గమిభక్షణజేయపైత్యకఫజాలములన్। వమనప్రమేహగుణముల। తమిద్రుంచునటంచుబలెకె తారేశధరా॥

పటికసురాకారంబులగుణము.

గీ॥ పటికసురాకారమను పానబలముతోను। మూత్రకృఛ్రాశ్మరిరోగమూలములను। ధ్రుంచునని చెప్పెధన్వంత్రిదేవదేవ॥

పంచలవణములగుణము.

గీ॥ పంచలవణాలనను పానబలముతోడ। భక్షణముసేయశూలలబారదోలు। ననుచుధన్వంత్రిబలెకెనానందముగను । భక్తజనపోషసర్వేశ పార్వతీశ॥

త్రికటుకములగుణము.

గీ॥ త్రికటుకంబులుఘృతముతోదినినవాత । పైత్యశ్లేష్మజ్వరాజీర్ణ శైత్యములను । బాపియారోగ్యమొసగుసుభాసురముగ । నవలనలరించునని యమునగరకత॥

## —త్రిఫలములగుణము.—

గీ॥ త్రిఫలములు చూర్ణముగ జేసి తేనెతోను । భక్షణము సేయకా సలబాలవోలి। దీపనాగ్నియు నారోగ్యతేజమొసగు । ననియు కుంభజుడెఱిగించె ననభ్రికేశ॥

## —నీలాంజనగుణము.—

క॥ అరుదుగ నీలాంజనమును। గురుతుగ సేవింప నేత్రకుటిలము నెల్లన్। ఒరిమాచి దృష్టిపుష్టియు। నుచితర తేజమును నొసగునుర గేంద్రధరా॥

## —శంఖభస్మగుణము.—

గీ॥ శంఖభస్మము సేవింపజనములకును। సూతికా వాతరోగాది శూలలణచి। దీపనమొసంగునని జెప్పె దేవవైద్యు । డతులితానందరూపచరాచరాత్మ॥

## —గవ్యభస్మగుణము.—

క॥ ఆరూఢభస్మమరుదుగ । కూరిమి చేగొనిన వాతగుణశైత్యములన్। మీరి హరించును దీపన। మారోగ్యంబిచ్చునని యొనమరిస్తుత్యా॥

## —ఇంగువగుణము.—

క॥ ఇంగువనను పానముతో। రంగుగ సేవింప శూలలఘువాతములన్। భంగమొనర్చును దీపన। మంగమునకొసంగునని యెనార్యస్తుత్యా॥

## —గుగ్గిలపుగుణము.—

క॥ గుగ్గిలము సేవ జేసిన । దగ్గులశూలలను బట్టి దండించు వెసన్। నుగ్గుగ జేసియు దీపనమగ్గలముగ జేయునని యెనంబికనాథా॥

## —కెంపుభస్మగుణము.—

క॥ కెంపుల భస్మము గొనినను। కంపితవాతాది శైత్యకఫజాలము లెల్లా। సొంపుగ ద్రుంచిచి రాయువు। నింపుగ దయసేయునని యె నిభచర్మధరా॥

## ==ముత్యభస్మగుణము.==

క॥ ముత్యములభస్మమరుదుగ। నిత్యముసేవింపరోగ నిచయములవెసన్। సత్యముగద్రుంచితేజము। నత్యంతమునొసగుననియెనార్యస్తుత్యా॥

## ==పగడభస్మగుణము.==

క॥ వరవిద్రుమభసితంబును। గరిమతోసేవింపపైత్యకఫవాతములం। బరిమార్చి దేహసౌఖ్యము। నురువుగసమకూర్చుననియెనురగేంద్రధరా॥

## ==పచ్చలభస్మగుణము.==

క॥ పచ్చలభస్మముఘృతముతో।నిచ్చగసేవింపగదనికాయములన్నిం। గచ్చిగజేసియువీర్యము। నిచ్చుననెదేవవైద్యుడిందునిభాంగా॥

## ==పుష్యరాగభస్మగుణము.==

క॥ ఇలపుష్యరాగభస్మము।నలరగసేవింపపాండువతిసారములం। దొలగించిమర్త్యకోటిని। వెలయించునటంచుబల్కెవిశ్వాధీశా॥

## ==వజ్రభస్మగుణము.==

క॥నరవజ్రభస్మమరుదుగ। గురుతుగసేవింపరోగగుణములనెల్లన్‌వ్రరుసగనుద్రుంచిన... ।నిరుపమతేజంబొసంగునీలగ్రీవా॥

## ==నీలభస్మగుణము.==

క॥నీలములభస్మమింపుగ। చాలగభక్షణముసేయక్షయరోగములం। గూలిచితేజోవిభవము। మేలుగనిడునంచుబల్కెమేరుగిరీశా॥

## ==గోమేధికభస్మగుణము.==

క॥ గోమేధికభస్మంబును। సామాన్యముగాభుజింపసతతమేహం। బామాతిసారబుజములు। భీమంబైద్రుంచుననియెభేషజుడీశా॥

## ==వైడూర్యభస్మగుణము.==

క॥ వైడూర్యభూతిగొనినను। వాడిజ్వరమేహపైత్యవాతములవె

సన్ | తాడనము వర్తిసౌఖ్యము | గూడగనలరించుననియె గోపతివాహా||

## సువర్ణభస్మగుణము.

ఉ|| శుద్ధసువర్ణభస్మమతిసొంపుగ సేవనొనర్చినన్ రుజా | బద్ధమొష్ణ్చి మేహయుత పాండుజలోదరగుల్మశూలలన్ | సిద్ధముగానణంచి యతిశీఘ్రము | మవారిత వీర్యమున్మహా | బుద్ధిచిరాయువిచ్చు నఘ పుంజ మణంచున నెన్ సదాశివా||

## రజితభస్మగుణము.

చ|| వదలక వెండి భస్మమును పానవిశేషముతో భుజించినన్ | మదయుతవాతపైత్యజ్వరమానిత గుల్మమహోదరంబులన్ | గుదియగజేసి తేజమొనగూర్చి చిరాయువువీర్యవృద్ధియున్ | ముదమునసిచ్చు మర్త్యులకు మూలమనేన్ సురవైద్యుడీశ్వరా||

## తామ్రభస్మగుణము.

ఉ|| నిర్మలతామ్రభస్మమిల నేర్పుగ సేవనొనర్ప శ్వాసలన్ | చర్మగతాష్టకుష్ఠులును చర్దిప్రమేహజ్వరాతిశూలరు | గ్స్మములెల్ల బాపి తనుకాంతిచిరాయువు దీర్ఘవృష్టియున్ | నిర్మలబుద్ధినిచ్చునని నిర్జరవైద్యుడు జెప్పెనీశ్వరా||

## వంగభస్మగుణము.

వాసిగవంగభస్మమును పానయుతంబుగ సేవయున్ సదా | జేసిన మేహపైత్యములజీర్ణకఫంబుల బాపి శూలలన్ | డాసిమధుప్రమేహముల తావాదవించి సువీర్యవృద్ధియున్ | వాసిగమర్త్యకోటినదివర్ధిలజేయున నెన్ సతీశ్వరా||

## నాగభస్మగుణము.

క|| వర నాగభస్మమురుదుగ | సురకుసుమముతోను సేవనూటియొనర్పం | బరిణామశూలలణచియు | సురుచిర చిరతేజమొసగు సోమకిరీటా||

## కాంతభస్మగుణము.

ఉ|| కాంతము సేవ జేసినను కామిలపాండుప్రమేహకృచ్ఛ్రిలన్ | వాం

తికఫత్రిదోషమునివారణజేసిక్షయాదిశూలలన్ । శాంతియొనర్చిపుష్టిఘనశౌర్యమవారితవీర్యవృద్ధివి । భ్రాంతిగనిచ్చుకాంతులనుభాతివహించునగేంద్రజా ప్రియా॥

## —లోహభస్మగుణము.—

సదమలలోహభస్మమతిసౌరభ మొప్పకటిత్రయంబుతో । వదలక చిన్నమెత్తుగొనవారగణాదిప్రమేహపాండువుల్ । నుదరమహోదరక్షయల నున్నతకాసలద్రుంచివేట్ర్ర్ చే । కుదురుగ కాంతినిచ్చునని కుంభజుతోనెరిగించెశంకరా॥

## —ఇరుపభస్మగుణము.—

ఉ॥ ఆయసభస్మమిశ్రకణమాజ్యయుతంబుగ సేవజేసినన్ । కాయసముద్భవకృములగాంభరజేసిదశార్శపాండువుల్ । ప్రాయమణంచిశోభలను బారగదోలిమనుష్యకోటికిన్ । ఛాయయొసంగివెల్గునని చయ్యనబల్కెశశాంకశేఖరా॥

## —వర్తలోహగుణమనగా సత్తుగుణము.—

గీ॥ వర్తలోహమునను పానవస్తువులతో । భక్షణముసేయరుజముల బలమణంచి । యాయురారోగ్యకరవీర్యమతులితముగ । నొసగుననిబల్కె సురవైద్యుడురగభూప॥

## —అభ్రికభస్మగుణము.—

చ॥ గురుతుగనభ్రికంబుననుకూలవిడెంబుతో సేవజేసినన్ । గరిమనువాతపైత్యకఫకాసమహాగ్రహణిప్రమేహముల్ । వరుసగద్రుంచిదీపనమవారితవీర్యమొసంగినేర్పుచే । ధరనమృతంబుతుల్యమనతద్దయునొప్పననెన్నదీధరా॥

## —వరివంటకగుణము.—

గీ॥ వాతపైత్యాదిరోగనివారణంబు । దేహకాంతియుసత్వముత్సా

హాపథము । వీర్యవృద్ధియునధికవివేకగుణము । లిచ్చువరివంటకంబులనేఁ దరమె॥

### కొఱ్ఱవంటకగుణము.

క॥ జ్వరవాతశ్లేష్మంబులు । హరియించును నుష్ణకారి అతిపైత్యం బుల్ । పురుషత్వముకొంచెంబగు । ధరశక్తియులేదుకొఱ్ఱవంటకమునకున్॥

### జొన్నవంటకగుణము.

క॥ చలువయుపైత్యహరంబును । బలువగుగుల్మంబుకాస పాండు క్షయలుఁ । గలరోగికివైరంబగు । యిలపైజొన్నాగరముకునివిలక్షణముల్॥

### వరగవంటకగుణము.

గీ॥ వరగవంటకంబు వాతపైత్యముజేయు । శక్తిహీనమగునుజఠర మధిక।మఖిలరోగములకునాస్పదంబవుచాల। వృష్యకారికాంతివిరహితంబు॥

### ఆరికెఅన్నగుణము.

గీ॥ అధికవాతముజేయు సర్వాంగములకు । ఉదరరోగంబుకాసా దులుద్భవించు । జ్వరములొదవును తనువునబాలకాంతి । బొందుభువిలోన యారికబోనమనఘ॥

### చామవంటకగుణము.

గీ॥ చామవంటకమునసంధిల్లుపైత్యంబు। వాతకారిశ్లేష్మవర్ధనంబు। అగ్నిమాంద్యమొదవున నచుగుల్మంబులు । కృమిహరంబుశక్తికీర్తివర్య॥

### సజ్జవంటకగుణము.

గీ॥ సజ్జవంటకమున సకలరోగంబులు । బుట్టుంతామసంబుభూమిజ నుల । కగ్నిమాంద్యమొదవునధికపీడలజేయు । శీతకారియధికభీతకారి॥

### వరిపిండీగుణము.

క॥ వరిపిండిశిరోగంబులు। హరియించునువృష్యకరములతిసత్త్వాంతి। స్ఫురణదనర్చునుశైత్యం । బరుదుగవృష్టియునుపుష్టినమరగజేయుఁ॥

## గోధుమపిండిగుణము.

గీ॥ వినుముగోధుమపిష్టంబువృష్యకరము। శ్లేష్మమొదవునువాతముల్ జెరుచుదేహ। ములకునెల్లగురుత్వంబుబలహితంబు। మిగులదేహంబురోగముల్ మొసలవనఘ॥

## మినపపిండిగుణము.

గీ॥ నడుమునొప్పికీళ్లుదొడరినశూలలు। వాతపైత్యరోగవారణంబు। రుచికరంబుశ్లేష్మరోగకారణమది। మెసగబద్ధకారిమినపపిండి॥

## చోడిపిండిగుణము.

క॥ మలహారమురోగశాంతియు। బలువగుదీపనముజేయు బలుశక్తియుగుక్। చలువగక్రిమినాశనమగు। జెలువలరగచోడిపిండిసింహూద్రివరా॥

## సముదాయపునేతిగుణము.

గీ॥ జ్వరములునున్మాదంబులు। హరియించును శూలలణచునవీర్యంబుల్। స్ఫురణముతేజముబలమును। నెరవైననుబుద్ధిగలుగు నేతినిధరలోన్॥

## (*)ఆవునేతిగుణము(*)

క॥ రాజులకును బాలురకును। తేజము గావించుదృష్టి దేదీప్యముగన్। భోజనసౌఖ్యమురుచియగు। యేజనులకుపథ్యాంబు ... గోఘృతము న॥

## గొర్రెనేతిగుణము.

గీ॥ గొర్రెనేతిగుణముగూర్చువాతంబును। శూలలొదవునశక్తిజాలగల్గు। మేహమూత్రకృఛ్రదాహంబులణగును। మదముదృష్టికరముమంత్రివర్య॥

## మేకనేతిగుణము.

క॥ ఏకరణి మేకనేతిను। వాతముపైత్యంబు శ్లేష్మపద్ధతిని సుచుక్। ఖ్యాతిగవృష్యకరంబగు। శీతోష్ణజ్వరములణచుసింహూద్రివరా॥

## ——ఆపుడు కాచిన నేతిగుణము.——

క॥ అప్పుడు కాచిన నేతను । చొప్పడుసత్తాక్రాంతి ముదిమిజోరగను మేనన్ । ముప్పిరిగొనుసత్యంబిది । నెప్పుడుచిరరోగమణచునిలనుగుణాఢ్యా॥

## ——వెన్నగుణము.——

గీ॥ అధికమగువీర్యవృద్ధియు । బొదలును దేహాంబుకాంతి బొందును లఘువై । వచలః నవనీతంబుచే । సదమలగావించుశక్తిసరసోక్తిభువిన్॥

## ——తేనెగుణము.——

ఉ॥ తేనెనుదృష్టియొసగగలుగు నెంచును శ్లేష్మము క్రొన్నిత్యముల్ । మూనునుదుష్టకుష్ఠవిషమక్రిముల్ మేహములు రాజగుల్మములన్ । మానుగగొట్టి మేను కుసమంచితసౌఖ్యముజేయు జేతఫుల్ । పానము జేయ యోగ్యమను పానము ఔషధసేవకైతగున్॥

## ——నూనెగుణము.——

క॥ తిలతైలంబునశూలలు । నలయించును కాంతిపుష్టినలరగజేయున్ । వలనుగదాహము జేయును । తలపశిరోరోగపాండుతతులుహరించున్॥

## ——నూనెఆముదముల సముదాయగుణము.——

గీ॥ ఇప్పనూనెవల్లనెల్లరోగంబులు । మానునాముదమున మారుతంబు । వేపనూనెనన్ని విషముహరించును । కానుగనూనెకుష్ఠుకాసలణచు॥

## ——ద్రాక్షఖర్జూరపుపండ్లగుణము.——

క॥ జ్వరవాతరక్తపైత్యము । హరియించును శ్వాస కాసలతిపీన్యము గన్ । గురుదాహమూత్రసారణి । విరియించును ద్రాక్షఫలమువిమలవివేకా॥

క॥ మదమొదవుతృష్ణ దాహము । బొదలినపైత్యంబుశ్లేష్మములుహరియించున్ । పదపడిహితవగుపుష్టిన్ । గలుగును ఖర్జూర ఫలముఘనమధురంబై॥

—దాడింబపండ్లగుణము.—

క॥ జ్వరవాతశ్లేష్మంబులు। హరియించును నాదిగాగనామయసమి
తిక్। పురుషత్వమొదవుపిత్తము। హరియించునుగ్రహణిరోగమణచుధరిత్రన్॥

—అరటిపండ్లగుణము.—

క॥ ఘనపాతశోఫకాసలు నొనరంగాబెరుచునగ్నినొగిమందమగున్,
వినువాతశ్లేష్మంబులు। అనటిఫలముచేతమూత్రమధికమునిచ్చు॥

—కొబ్బరికాయగుణము.—

క॥మందాగ్నిబరిహారంబగు। బొందుగశ్లేష్మంబుచాలపుష్టికరంబుక్।
మండంబునుష్ణవీర్యము। పొందుగటెంకాయగుణము భూరిగుణాఢ్యా॥

—మాదీఫలగుణము.—

గీ॥ శ్వాసకాసగుల్మక్షయనాశనంబగు। పైత్యరోగలెల్లబరిహరిం
చు।చలియునొదవుమిగులసౌఖ్యంబుమందాగ్ని। మాదిఫలముగుణముమంత్రి
వర్య॥

—(*) మామిడిసముదాయగుణము. (*)—

క॥ వడపిందెసకలరోగము। లుడుచుక్పైత్యంబుపులుసుబొదలిన
కాయల్। కడునుష్ణగుణముశ్లేష్మము। వడిమామిడిఫలము జేయువాతహ
రంబుల్॥

* నేరేడుపండ్లగుణము. *

క॥ హితకరముజేయువాతము।లతిశయముగమేహమణచునతిమధు
రంబై। మతిగల్గువిషహరంబును। క్షితిలోనేరేడుపండ్లుసింహాద్రిపరా॥

* మేడిపండ్లగుణము. *

క॥ వినుపైత్యశ్లేష్మంబుల।కనుమూలమువాతహరముకడరుచ్యకరం
బొనరించుజాడ్యమెప్పుడు।తనువునకుక్మేడిపండ్లుతగునీగుణముల్॥

==బీరకాయగుణము.==

క॥ దీపనమురుచికరంబును । నేపునపురుషత్వమొదవుహీనజ్వరసం॥
తాపములమాన్పుమధురము। దీపింపగబీరకాయ తెల్లంబనఘా॥

==కాకరకాయగుణము.==

క॥ హితతిక్తకారిపైత్యము। అతిశయముగవాతరోగమణచుం గ్రిముల౯। హతముగజేయునువీర్యము. । క్షితికాకరకాయవేడిజడముగ జేయు౯॥

==లేతవంకాయగుణము.==

గీ॥ లేతవంకాయశ్లేష్మంబువాతహరము । గలుగునతివృష్యకరము
నుగలుగజేయు । ముదరవంకాయతీటయునదియుగల్గు । పండువరుగునవా
తంబుపండితేంద్రా॥

==లేతములగకాయగుణము.==

గీ॥ లేతములగకాయవాతజ్వరంబులు। నేత్రరోగములనునిగ్రహించు।
పైత్యకరముజేయుపండుకాయలుశ్లేష్మ । కరముముదరపైత్యకారియనఘ॥

——మునగకాయగుణము.——

గీ॥వాతకుష్ఠ మేహ జాతరోగంబులు। నాశమొందుదీపనంబుజేయు। త
లపరోగములకుతెగ ఎధ్యకరమగు । కటువురుచియుమునగకాయగుణము॥

==పుచ్చకాయగుణము.==

గీ॥ కుష్ఠునేత్రరోగగుణములుహరియించు। మూర్ఛమేహజాతములు
నశించు। శీతకారిరుచియుప్రీతిమైదనరును। పుచ్చకాయగుణముపుణ్యచరిత॥

==ఆకాకరకాయగుణము.==

క॥ జ్వరపైత్యశ్లేష్మంబులు ।హరియించునుశ్లేష్మకాసలతీగుల్మాదుల్।
హరియించుమపృష్యకరమగు। ధరనాకాకరగుణంబుధర్మనిధిజ్ఞా॥

—బోడతరముగుణము.—

క॥ కటుతిక్తముష్ణమొదవును । పటుతరగుల్మోదరంబుపాషాణహ
రం । కఫవాతశూలశ్లేష్మము । తటుకునహరియించుబోడతరమఃధరిత్రిన్॥

—బలుసుకూరగుణము.—

క॥ చవగు తిక్తగుణంబగు । వెలయగురుత్వంబుజేయువింశతిమేహం।
బులుప్రకాణివ్యాసులుబుగుకసు । కొలదిగరుచికరముబలుసకూరధరిత్రిన్॥

—పచ్చపెసరపప్పుగుణము.—

క॥ జ్వరశూలపైత్యకాసలు । హరియించునువాతశమనముగుపైత్యం
బుల్ । నిరతమదీపనకరమగు । పరికింపగపచ్చపెసరపప్పుననఘా॥

—కందిపప్పుగుణము.—

క॥ మందాగ్నిబాధనుదెప్పడు । అందముగావాతపైత్యమస్త్రిను
లుక్ । జెందవురుచియగుదీపన । మొందుందగకందిపప్పునర్వదలంపక్॥

—శనగపప్పుగుణము.—

క॥ వాతపైత్యగురుత్వము । ఖ్యాతిగశుభమెసగుశ్లేష్మపొందుచుపు
ణచుక్ । ప్రీతియునింద్రియ బలమును । భూతలమున శనగపప్పునూ
గుణాఢ్యా॥

—అనపపప్పుగుణము.—

గీ॥ అనపపప్పువాతమగుశోఫకాసలు । మహాతశూలలొదవుమా
ద్యకారి । బురుషజాడ్యమబ్బు బుద్ధిహీనంబగు । గర్భశూలలొదవుకాం
జెరుచు॥

—జీడిపండ్లగుణము.—

క॥ పుష్టియుమందమణంచును । యుష్ణముగానుండుపైత్యములరో
బుల్ । నష్టముజేయునుశుక్లమువిశ్వోదరజీడిపండ్లనిశదగుణంబుల్॥

—తుమ్మి పండ్లగుణము.—

క॥ ఇరవుగ వాతము పైత్యము । లరయంగా శ్లేష్మహారము హాత దౌర్బల్యమున్। సరగున పుష్టియు చలువను । ధరలోపల తుమ్మి పండ్లంత గుని గుణముల్॥

(*) చింతపండుగుణము. (*)

క॥ ఇది సర్వరోగచయములు । మదమణచు త్రిదోషములను మాన్పు సు మూర్ఛల్ । కదిలించు జ్వరములనిశము । నధికము రుచి చింతపండు కవని గుణాఢ్యా॥

(*) వెల్లుల్లిగుణము. (*)

క॥ ఇలగల్గు శూలలు గుల్మం । బులు మందాగ్నియును వాతములు శ్లేష్మశ్వా । సలు నర్శ క్రిమి హారంబగు । విలసితము గపిత్తకారి వెల్లుల్లి హరా॥

(*) నీరుల్లిగుణము (*)

క॥ నీరుల్లి గడ్డ వాచవి । సారంబగు రక్తపైత్య జాడ్యము లణచున్ । బేరుబలంబు గురుత్వము । నారూఢిగ వీర్యవృద్ధియగు వేడిమి చూచున్॥

== ముల్లంగిగడ్డగుణము. ==

క॥ ముల్లంగిగడ్డ గునూష్ణము । బల్లిదము గుజీర్ణకారి బహువాతహరంబెల్లి । గాలు పైత్యగుల్మము। ముల్లంబగు శూలలెల్ల మునిహరియించున్॥

== అల్లముగుణము. ==

క॥ వాతశ్లేష్మశ్వాసలు ధూత జ్వర క్రకఠినగుల్మ పూరిత శూలల్ । భూతలమునందు నల్లము । చేతను శోఫలును పైత్యజాతులు మానున్॥

== సముదాయపుపాలగుణము. ==

క॥ శూలలు వాతము పైత్యము । లోలిన ముఖరోగచయములో గ్లేష్మంబుల్ । చాలహరియించు లఘువగు । పాలును శుక్లంబు వృద్ధి పండితవర్యా॥

—ఆవుపాలగుణము.—

గీ॥ ఆవుపాలవల్లనధికబుద్ధిఘటించు। లఘువువీర్యకరములలర జేయు। ముక్తియొదవురోగములుశాంతిబొందును। సౌఖ్యమొదవుభువినసార్వభౌమ॥

—మేకపాలగుణము.—

క॥ మదిమియురోగచయంబుల। నదవించునుసుష్ణకారియతిశుక్లంబున్। అధికముగుకాంతినిచ్చును। పదయుడవినుమేకపాలుసౌజన్యనిధీ॥

—గేదెపాలగుణము.—

గీ॥ బర్రెపాలశక్తి సబలవీర్యకరంబు। శ్లేష్మనాశనంబుభీష్మమదము। గొర్రెపాలవల్లగూర్చురోగంబులు। గల్గుశక్తి వృష్యకారియనఘ॥

—నీళ్లగుణము.—

గీ॥ ఉప్పినీళ్లదాహముడుగదుపైత్యంబు। మేహమొదవుకాంతిమిగులజెడును। చెట్లపట్టునీళ్లుచల్లవూటగుజాలు। త్రాగవలదుసకలరోగచయము॥

—కలకనీటిగుణము.—

క॥ కలకజలంబునను దరము। నెలకొనుకాకయును తీటనిద్రయుమబ్బున్।కలలోను పాండుత్వము యును। వలదుసుమీత్రావశక్తివైవర్ణ్యముగున్॥

వస్తుగుణప్రకరణముసమాప్తము.

భిషగ్వరాంగము
వైద్యగ్రంధము
సమాప్తము.

## కఠినపదములకు అర్థములు.

అశ్రుబాష్పములు=కన్నీళ్లు
అహి=సర్పము
ఆర్ద్ర=అల్లము
ఇందీవరము=నల్లకలువ
కట్ఫలము=కాయఫలము
కఫరి=పాలతుత్థము
కరి=ఏనుగు
కండూతి=దురద
కాకోదరము=సర్పము
కాంచనము=బంగారు
కాస=దగ్గు
కాయము=శరీరము
కాంస్యపాత్ర=కంచుగిన్నె
క్వాథము=కషాయము
కుక్కుటము=కోడి
కోదమసింహము=సింహపుపిల్ల
కృష్ణకాంచనము=నల్లఉమ్మెత్త
గవిదుగ్ధము=ఆవుపాలు
గాంగేయము=బంగారు
ఘుటికలు=మాత్రలు
చణకమాత్రము=సెనగగింజ ప్రమాణము
చరణాయుధము=కోడి
ఛర్ది=వమనము
ఛాగము=మేక
చాతుర్జాతకములు=ఏలకులు, దాల్చినచెక్క, ఆకుపత్రికము, నాగకేసరములు

జలూకము=జలగ
టంకణము=వెలిగారము
డోలిక=ఉయ్యాల
తపనాంశము=ఎండ
తాడనము=కొట్టుట
తార=వెండి
తార్క్ష్యఘూకము=మూకుడు
త్రికటుకములు=శొంఠిపిప్పలిమిరియాలు
త్రిఫలములు=కరకతాడీఉసిరికలు
దరదము=ఇంగిలీకము
దంతి=ఏనుగు
ధరణప్రమాణము=నాలుగుమినపగింజలయెత్తు
ధాత్రి=ఉసిరిక
దీపనము=జఠరదీప్తి
ధూర్తబీజములు=ఉమ్మెత్తవిత్తులు
నయనములు=నేత్రములు
నాగము=సీసము
నిర్గుండి=వావిలి
పగడభూతి=పగడపుభస్మము
పంచకోలములు=పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి
ఫణి=సర్పము
పాదాంశము=నాలవభాగము
పారదము=పాదరసము
పిక=కోవెల
పిత్తము=చేదుకట్టు
బలి=గంధకము

బిడాలము=పిల్లి
భేకము=కప్ప
భృంగ=గుంటకలగర
మరీచి=మిరియాలు
మయూరము=నెమలి
మహిషము=దున్నపోతు
మారుతము=వాయువు
మారిచ=మిరియాలు
మాషము=మినపగింజ
మూర్ధ=శిరస్సు
యామత్రయము=మూడుజాములు
రక్త=ఎరుపు
రౌప్యము=వెండి
లావుకము=లకుముకిపిట్ట
లులాయ=కారుదున్న
వత్సనాభి=నాభి

వరాటము=పత్సగవ్వ
వరాహము=అడవిపంది
వహ్నిరసము=చిత్రమూలరసము
వంగము=తగరము
వింశతి=ఇరువది
శాల్మలి=బూరుగజిగట
శ్యామల=ఆకుపత్స
శ్వాస=వగర్పు
సర్ష=ఆవగింజ
స్వర్ణభస్మము=బంగారపు భస్మము
సికతాయంత్రము=వాలుకా యంత్రము
సూకరము=అడవిపంది
సూతము=పాదరసము
స్వేదము=చెమట
హరిద్రము=పసపు.

